# అభిజ్ఞ

కవితా బులెటిన్-2 ఫిబ్రవరి 1992

కవిత్వం :

కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ
చెళ్ళపిళ్ళ వెంకటరమణ
డా॥ రావూరి భరద్వాజ
సి. హెచ్. ఉషారాణి
కె. రామమోహనశర్మ
సి. వి. కృష్ణారావు
హరి చంద్రశేఖర్
సయ్యద్ మోహసీన్
నరసింహగౌడ్
యస్. మజీద్
నిఖిలేశ్వర్
సౌభాగ్య
సిద్ధార్థ
రాజు

లోర్కా అధివాస్తవిక కవిత్వం
—అవంత్స సోమసుందర్

మూడు రూపాయలు

Edited by Dr Sumana Sri on behalf of KAVI MITRULU
and Published at Dakshin Bharat Press, Hyderabad.
Price Rs. 3/-
Cover design : Nagarjun
For Copies : Dr. Sumana Sri, Plot No. 121/3, Kalyan nagar,
S. R. nagar (Post), Hyderabad-500 038.

సి.హెచ్. ఉషారాణి

## బాల్యం

నాబాల్యం ఎప్పుడు నానుండి జారిపోయిందో
అర్థంకావడంలేదు.
పక్కింటి వాళ్ళతో దాగుడుమూత లాడుతుంటే
నాన్నగారు కళ్ళెఱ్ఱ జేసినప్పుడే అనుకుంటా,
అమ్మమ్మ, నీకింకా మగపిల్లలతో మాటలేమిటీ
అని కోప్పడినప్పుడే అనుకుంటా.
అమ్మ, ఎదురింటబ్బాయితో మాట్లాడవద్దని
హెచ్చరించినప్పుడే అనుకొంటా,
చిన్నపిల్లలతో సమానంగా ఎగరాలను కొన్నప్పుడెందుకో
బిడియం అడ్డువచ్చి ఆగిపోయినప్పుడే అనుకుంటా.
ఇలా ఆలోచిస్తున్న నేను—
నా వోణీ రెపరెపలాడగానే ఉలిక్కిపడ్డాను.
నిజంగానే! నాబాల్యం నాకు చెప్పకుండానే
నా ఒడిలోనుండి జారుకుంది-
మెల్లగా జారుకుంది నాబాల్యం !

ఇం.నెం. సి2/42, హుడాకాలనీ, చందానగర్. హైదరాబాద్-188.

హరి చంద్రశేఖర్

# బాబ్జీ అమర్ హై

ఇక్కడ ఎర్రని ఆకాశం ఆగం చేస్తున్న ఆవుమీద లంఘిస్తున్న ఆంబోతు
కుమిలి కమిలిన ముఖాన్ని కప్పుకుంటున్న చీకటి పుట్టం రాత్రి
ఇది మక్కెలుబట్టలు కాల్చుకుంటున్న గుండె కొలిమి
ఇది అందరూ భాస్వరపు బొమ్మలై మండుతున్న కొలువు

నాటకీయ రాజకీయాలు, వ్యక్తులు, సమాజాలు
శాస్త్రాలు, తత్వాలు, న్యాయసూత్రాలు
అన్నీ మండుతున్న పెట్రోలు బావులు
మంటలార్పే శాస్త్ర పరిజ్ఞానం కోసం
ఇంకా ప్రణాళికా ప్రయోగశాలల్లో పరిశోధన సాగుతోంది.

గుండెల బావుల్లో ఇంకా చమురు, ఖనిజ వాయువుల్ని దాచుకున్న
బాబ్జీ లెంతమందో!! కొప్పులో మల్లెచెండ్ల వంటి చరితాత్ములో!!
ఈ శతాబ్దపు రెండో సగంలో కూలుతున్న చరిత్ర గోడల బండరాళ్ళు
మీ హక్కు అనన్యం
ఆత్మహత్య చేసుకుంటారో, హత్య చేయబడతారో
మీకు మీరే స్వేచ్ఛగా ఎంచుకోవచ్చు.

మీరు తాటాకులు ఝళిపించండి చాలు,
ఒక అంగుటికి రక్తస్రావ మవుతుంది.
కొత్తకొత్త బావుల్లోంచి సానుభూతి చిమ్ముకొస్తుంది.

---

127—C, సంజీవరెడ్డినగర్, హైదరాబాద్-38.

పతాక శీర్షికల్లో రక్తపు మరకల సింహాసనాలై,
చీకటి గోడల నీడల పిలుపులై
పసిడి పెద్దమనిషైందని పేరంటానికి పిలుచుకుంటాయి
స్వయంగా వేషం కట్టిన మొసలి బొట్లు బొట్లుగా
న్యాయస్థానానికే శిక్షాస్మృతి ఉపదేశిస్తుంది

నీ హత్య అయినా, ఆత్మహత్య అయినా
వారి కదన కౌశల ప్రదర్శనలో కట్టె తుపాకీ

ఖాద్దీ మాత్రం అమర్ హై!
ఇక్కడింకేంపని వాడికి?

గొథె కవిత :

## అంతరాత్మ ప్రబోధం

జీవితంతో చెలగాట మాడేవాడికి
శూన్యమే ప్రతిఫలంగా మిగుల్తుంది
అంతరాత్మ ప్రబోధానికి
అవనతం కానివాడు
ఆజన్మాంతం
బానిస బతుకు బతుకుతాడు.

(అనుసృజన : సౌభాగ్య)

---

పి. సౌభాగ్య, సిస్టమ్స్ ఆడిట్, హెచ్.ఎ.ఎల్., బాలానగర్, హైదరాబాద్-42

సిద్ధార్థ

## అతనొక హిప్నొటిక్ నీడ

నేనందించిన మాటల్ని ఎంతో నమ్మకంతో
గుండెలో వేసుకుని వెళ్ళిపోతాడు
ఒకరి కొకరం కొన్ని నిముషాల జీవితాన్ని
వడబోసి వంచుకున్న తరువాత
రోజురోజుకీ ఇరుకవుతూన్న సహచర్యాలూ
సంఘర్షణాగ్నిలో మండే ప్రాథమిక సంబంధాలూ
మృత్యుబిలం లాంటి నమ్మకాలూ
రేఖామాత్రంగా స్పర్శించిన తరువాత
నేనందించిన మాటల్ని ఎంతో నమ్మకంతో
గుండెలో వేసుకుని వెళ్ళిపోతాడు.
ఇద్దరమూ రెండు పెంపకాలకీ
రెండు రహస్యాలకీ
సాంకేతిక చిహ్నాల నీడలమే అయినా
అతను నిలబడ్డ స్థలంలో మనిషితనం
చెమ్మగిల్లిన చెలమ బుడగ పారుతుంది.
అప్పుడప్పుడు ఈ గుండె డైనమైట్లను మోస్తున్న
లెదర్ బ్యాగ్ లా ఉందంటాడు
పాకురు పట్టిన ఊహల్నీ, చేష్టల్నీ
జిల్లేడు పూల జిగురుతో కడిగేయాలంటాడు

---

1-8-40/A, చిక్కడపల్లి, హైదరాబాద్-20.

మా ఊర్లోని
డిల్లెం బర్సెం అయ్య, బతుకమ్మ పాట
ఇరానీ హోటల్ చాయ్.
పీర్ల ఊరేగింపులో నిప్పుల్ని తొక్కే పాదాల
తెగింపూ తనకిష్టం అంటాడు
స్విచ్ వేసినపుడు బల్బు నవ్వినట్టుగా ఉంటుంది
అతని చూపు
సైరన్ మోత వినగానే సైకిలెక్కి వెళ్ళిపోతాడు
రెండు అస్పష్ట ఛాయాచిత్రాలు అతని కనుబొమ్మలమీద
నల్లటి నెత్తుటి ఖండాలై వ్రేలాడుతూనే ఉంటాయి.
లోలోపలి మార్మిక దుఃఖావస్థలని ఎలా కడిగేయాలని
నిలదీస్తుంటాడు.
నా వెన్నుపై ధైర్యాన్ని గునపంలా గుచ్చి
హఠాత్తుగా చనిపోయిన మా 'నాయన'
గుర్తుకొస్తాడతన్ని చూసినపుడు
సర్కసు బావిలోని మోటార్ సైకిలిస్టు ఫీట్స్‌లాగా
అడుగుల్లోకి, అడుగుల్లేని లోవల్లోకి, వలయాంతస్థలాల్లోకి
నెట్టేసింది అతనే నన్ను
చనిపోయిన అజ్ఞాత వ్యక్తి 'కఫన్'ని కూడా
గ్రంథాలయం చెయ్యమంది అతనే నన్ను
ఆకాశంలో పక్షుల ప్రవాహాల కోసం వెదికే
కంటిచూపు సౌందర్యం నాలోకి
ప్రసారం చేయించింది అతనే....
ప్రతిరాపిడినీ....గాయాల చెమ్మనీ....
అయస్కాంత దీపంగా గుండెమీదికి కప్పుకోమన్నదీ అతనే నన్ను
నిజం....ఇప్పటికీ అతనొక హిప్నోటిక్ నీడలా
నన్ను అనుసరిస్తూ
అనుభవాన్నిస్తూ....

రాజు

# సూర్యశతారి నుంచి...

3

ఏడాది పాటు కాలంతో పోరాడి చెట్లు విజయోత్సవాలు
జరుపు కొంటాయి రంగుల జెండాలెగరేస్తూ
వాద్య బృంద పరివేష్టితుడై ఆస్థాన గాయకుడు జాతిగీతం
పాడుతుంటాడు వినయంగా.
పండుగ చేసుకొంటున్న ప్రకృతిలో లీనమౌతున్నా
ప్రస్థానం ఎప్పుడూ నన్ను తట్టి లేపుతూనే వుంటుంది.
నా అవయవాల్ని సున్నితమైన దారంతో కుట్టి చెట్లు
నన్ని అవనీతలానికి కట్టేశాయి బలంగా.
ఎన్నో దుఃఖాల్ని, దురాగతాల్ని జయించిన నేను ఈ బంధాన్ని
తెంచుకొని స్వేచ్ఛ పొందలేకపోతున్నాను!

4

సూర్యగానం చేస్తూ సముద్రం చందమామతో
ఆడుకొంటూ వుంటుంది.
ఒడ్డున నిలబడి ఆ దివ్యకేళిని తిలకిస్తూ మధుర నాదంలో
లీనమౌతూ వుంటాను.
ఓ ఒంటరి తీతువు దిగులుగా అరుస్తూ, ఏకాంతాన్ని
భంగపరుస్తూ వుంటుంది; నా మీదుగా అలలపై పచార్లు చేస్తూ,

---

7-37, సంగీత్‌నగర్, కూకట్‌పల్లి, హైదరాబాద్-872.

ఎంత వెలుతురుతో స్నానం చేస్తున్నా, నీడ నా నుంచి
తొలగి పోవటంలేదు — మరీ దట్టంగా కప్పేస్తూ నా జాడనే
సవాలు చేస్తోంది.
ఏ కోణానా నీడపడనీయని నీ తేజస్సులో నే స్తం! నన్ను
జలక మాడనీ.

5

అందంగా ప్రవహించే సుందర భవంతుల మధ్య, మందంగా
పడివున్న రాచబాటలో ఆ అగ్గితేరు మీద ఎన్నిసార్లు
విహరించానో గుర్తులేదు.
పట్టు కుచ్చుల పల్లకీలో ఊరేగుతూ ఈ పచ్చని పరువాలతో
ఎన్నిసార్లు క్రీడించానో జ్ఞాపకంలేదు.
అవనిత శిరస్సుతో అంధకారంలో ఉక్కిరి బిక్కిరి
అవుతున్నప్పుడు, తన అమృత స్పర్శతో అవని,
ఈ వెలుతురులో ఎన్నిసార్లు నిటారుగా నిలిపిందో
స్ఫురించటం లేదు.
కానీ!—

వెండి గిన్నెలో పాలబువ్వకలిపి, కథలు చెపుతూ అమ్మ
తినిపిస్తున్నప్పుడు—బుద్ధిగా నీ సరసన కూర్చొని,
బంగరు పళ్లెరంలో అమృతం సేవిస్తున్న క్షణాలు గుర్తొచ్చి
నప్పుడు మాత్రం నా ఆకలి అధికాధిక మౌతూవుంటుంది.

యస్. మజీద్

# నా బాల్యం గుండ్లకమ్మ....!

నన్ను కన్న మాపూరిలో అడుగుపెట్టాలంటే
ముందుగా గుండ్లకమ్మతల్లి గుండెలో కాలుమోపాలి.
అలా మెల్లిగా కాలు పెడతానో లేదో
మోకాటినీటిలో జీవనాన్ని కొనసాగిస్తున్న ఆ తల్లి
నా కాలిని ఆప్యాయంగా తీగలా చుట్టేస్తుంది!
నే నడుస్తూ నడుస్తూ గుండ్లకమ్మ వంటిపై చిటికెలు వేస్తానా....
రివ్వున పై కెగిరిన ఆనీళ్ళు
నా ముఖంపై నీటి బుడగ పుష్పాలౌతాయి!

× × × ×

చిన్నప్పుడు
మద్దిపాడు హైస్కూల్ కెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు
గుండ్లకమ్మతో ఆడుకొన్న జ్ఞాపకక్షణాలు గుర్తొస్తే,
నేను పండెండేళ్ళ కుర్రాడినై పోతా!
చల్లటి ఆ ఇసుకమేనిపై దొర్లినప్పటి అనుభూతితడి
ఇప్పటికీ నన్ను తాకుతూనే వుంటుంది!
గుండ్లకమ్మా! గుండ్లకమ్మా!!
దారిలో దప్పికేసిన దాహాన్నంత దొసిలిపట్టి ఎన్నిసార్లు నీ గొ...

C/o సుల్తాన్ సాబ్, మల్లవరం, వయా తెల్లపాడు, ప్ర...శం

గుర్తుందా...!
నిజం చెప్పాలంటే —
అసలు నాబాల్యం గుండ్లకమ్మ !
నన్ను 'రా' రమ్మని పిలిచే గుండ్లకమ్మతోనే
నా స్కూలు సెలవు దినాలన్నీ గడిచిపోయేవి।

× × × ×

ఇక నేను గుండ్లకమ్మ అవతలి ఒడ్డున కాలుమోపగానే
పాపం గులకరాళ్ళు నేస్తాల్లా నా అరికాళ్ళను తాకుతాయి!
నాలుగు అడుగులు వేయగానే మట్టినేల నన్ను అంటుకొంటుంది।
ఆ నల్లరేగడి మట్టి వాసన ఎంతకమ్మగా వుంటుందని!
మరో పది అడుగులు వేస్తానో లేదో
ఏటి ఒడ్డున యేపుగా పెరిగివున్న జొన్న కంకులు
నన్ను ఆహ్వానిస్తూ తలలాడిస్తా
కండబలిసిన రెండు కంకుల్ని తుంచుకొని హుషారుగా నేను సాగిపోతాను।
ఆఖరినిమిషంలో—
ఊరిపొలిమేరలోని చింతచెట్టు దగ్గర ఆగిపోతాను।
ఆ చింతచెట్టు యిప్పటికీ ఠీవిగా నిలబడి
అన్నిబంధాలూ వదిలేసిన అపరయోగిలా వుంది।
ఆ చింతచెట్టుకింద—
నా బాల్య జ్ఞాపకాల్ని తడుముకొంటూ మరోసారి పండెండేళ్ళ కుర్రాడినౌతా।
ఇక—
ఊరి నడిబొడ్డుమీద పడతానో లేదో
ఊరుపూరంతా గొప్ప ముఖ దృశ్యమై విప్పారుతుంది।

శ్రీమతి చెళ్ళపిళ్ళ వెంకటరమణ

## రోడ్డు మీదకు రాకు!

రోడ్డు మీదకు రాకు అన్యాయంగా బలై పోతావు
అడ్రస్సుల్లేని శవాల్లో కలసిపోతావు. రాజకీయపు ముఠా తగాదాల్లో
మతకల్లోల మారణ హోమాల్లో గూండాలరాజ్యంలో
రాబందుల కబంధ హస్తాల్లో నువ్వు సమిధవై పోతావు
మహానగరంలో హాయిగా ఊపిరి పీల్చాలనుకుంటున్నావా?
బాహువుల విరుచుకుని స్వేచ్ఛగా తిరుగుదామనుకుంటున్నావా?
వెర్రివాడా! ఎప్పుడు ఏ రాజకీయ శక్తులు విజృంభిస్తాయో తెలీదు
ఎప్పుడు ఏ రౌడీల మహారాజుమెదడు నడిరోడ్డుమీద పగుల్తుందో తెలీదు
కాల తారతమ్యం లేకుండా బస్సులు, రైళ్ళు ఎప్పుడు
భోగిమంట లేసుకుంటాయో తెలీదు. కేసుల్లేని పోలీసుల చేతుల్లో
ఎప్పుడు ఎముకలు విరగ్గొట్టుకుంటావో తెలీదు

అర్ధరాత్రి ఆడది తిరిగే రోజురాకపోయినా
మగాడు తిరిగే రోజుకూడా వుండటంలేదు. కిడ్నాప్‌లు, రేప్‌లు,
తప్పిపోవడాలు
హత్యలు, ఆత్మహత్యలు, కత్తిపోట్లు- వీటికి వయోపరిమితిలేదు
ఇవన్నీ అతిసాధారణ విషయాలే, గాలిలో ఎగిరే ధూళికణాలే!
అందుకే — రోడ్డు మీదకు రాకు! అన్యాయంగా బలై పోతావు!

---

ప్లాట్‌నెం. 121/3, కళ్యాణ్‌నగర్, ఎస్. ఆర్. నగర్, హైదరాబాద్-38.

డాక్టర్ రావూరి భరద్వాజ

# ఒకింత వేకువ కోసం... నుంచి

ఓ వసుంధరా! నాదో చిన్న విన్నపం!!
ఇప్పుడే నిరుపయోగంగా ఉన్న, ఈ నా శరీరం మరణానంతరం
ఎవరికీ పనికిరాదు.
అప్పుడు నీ పొత్తిలిలోకి నన్ను చేరుస్తారు
అప్పుడు నీవు మునివేళ్ళతో నన్ను ఆప్యాయంగా పలకరిస్తావు
అప్పుడు నీవు మెత్తగా నన్ను హత్తుకొంటావు
అప్పుడు నీవు నా నిండా వొత్తుగా అల్లుకు పోతావు
అప్పుడెప్పుడో నీ నుంచి వేరయి పోయిన నన్ను, తనివారా
కౌగిలించుకుంటావు. నీ గాఢా లింగనంలోకి నేను
వారిగి పోతాను కరిగిపోతాను.
నన్ను నేను పోగొట్టుకొని నీలో పూర్తిగాలయించి పోతాను
అప్పుడు నీకూ నాకూ మధ్య ఆవంత తేడా కూడా ఉండదు
ఓ పృథ్వీమాతా! ఓ దయామయీ! నా సమస్త శరీరాన్ని
నీలో పొదువుకో కలుపుకో—నాకేమీ అభ్యంతరం లేదు
కానీ-తల్లీ! నా పెదవుల జోలికి మాత్రం రాకు
వాటిని అంటకు, వాటిని ముట్టకు
అలాగే—వాటినలాగే—ఉండి పోనీ తల్లీ!
నా కాంతం పేరును పలికీ పలికీ పలికీ; ఆ పేరును
జపించీ జపించీ జపించీ పరమపునీతమైన
ఆ రెండు పెదవులను మాత్రం నువ్వు స్పర్శించకు
దశాబ్దాలు, శతాబ్దాలు, సహస్రాబ్దాలు, మన్వంతరాలు గడిచిపోనీ!
ఆ నామస్మరణం అనాహతంగా, అలాగే సాగిపోనీ!!

---

159/2RT, విజయనగర్ కాలనీ హైదరాబాద్—500 457.

కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ

## జంతునేత్రం

ముక్కలు ముక్కలుగా లోకాన్ని
లెక్కించే అంకెల మీద
నా చుట్టూ నేను వృత్తాలు రచిస్తో
ఉద్యోగ విధి మీద నేను.
సెకను సెకన్ల రజను జారు
అంకెల గానుగు గడియారం
నా మణికట్టు నాడీమండలం మీద
ఒక యంత్రలోక స్థావరం.

చిరుచీకటిలో జంతునేత్రంలా
మెరిసే గడియారం నుండి
చేయి విడిపించుకొనే
సాయంకాలాంతంలో
చరచరా వెలుతురు తెరలు తొలగిపోయి
వజ్రబీజాలతో
ఆకాశం మిలమిలా మేలుకొంటుంది.

నిదుర అగాధాల మీద
నిశ్శబ్ద స్వప్నాలు ఎగిరే
ఈ రేయి, ఇద్దరం దగ్గరై
ఎదపై ఎద హత్తిన ఏకనాదం
దేని లెక్కా లేని ఆనందం—
తార లనంతం, విశ్వ మనంతం
అగణిత కాలంలో
అగణిత సౌందర్యం.

కె. రామమోహనశర్మ

# ప్రశ్నింకా అక్కడే ఉంది

ప్రశ్నింకా అక్కడే ఉంది; కల్లోల సంకేతాల విద్యుత్ స్పర్శలందాక-,
పొలమారిన గొంతులోంచి పొంగుతున్న వేదనా ప్రవాహంమీద.
పొలిమేరలోని కేక ప్రతిధ్వనిస్తూనే ఉంది.
ఊరి వసారాలో శరీరం సేదతీర్చుకొంటున్నా-,
చేతివేళ్ళ నరాల మీద ఒక్కొక్క ముద్రగా సాగుతున్న రక్తనదిమీద.
గుప్పెటింకా మూసుకొనే ఉంది. రహస్యాల పక్షు లెగిరి వెళ్ళిపోయాక-,
సత్యాన్వేషణకోసం వాక్యం నాలుక నదిమి పెడుతున్న శబ్దంమీద.
అనుభవమింకా పదును కావాల్సే ఉంది.
స్వాప్నిక సుషుప్తంనుండి కనులు విచ్చాక —,
రేపటి మొక్కను భృకుటిమీద నాటేందుకు
దోసిలొగ్గుతున్న జ్ఞాపకాలమీద.
ఒక సందిగ్ధ కోణీయరేఖ మీద ఆలోచనల పాదాలు పట్టు సడల నివ్వటంలేదు.
అస్తినాస్తి చర్చావేదికమీద రాత్రంతా ఆవిరవుతూనె ఉంది.
రక్తనేత్ర వృంతంమీద గుర్తులరేకులు నవ్యదిశగా విచ్చుకుంటూనే ఉన్నాయి
రూపాంతర వ్యవస్థా నిర్మాణం కోసం ఆశాగుహలోకి ప్రయాణం
సాగిపోతూనే ఉంది.
అంతర వేదననుండి సామాజిక దుఃఖం వైపు నిశిత దృష్టి పాశాలు
ాక్కెశతాయి.
ప్పుడే ముక్కలైన సమూహాంగాలు దేహంగా ప్రత్యక్షమవుతాయి.
—ఒక తడి గుండెను పొదిగేందుకు సృష్టి రచన కుపక్రమిస్తుంది.

---

8/142, హుడాకాలనీ, గంగారం, హైద్రాబాద్-500583

నర్సింహగౌడ్

## నాకళ్ళు మూతబడక ముందే

చీకటిలో దారి తెలీక భయపడతావని కళ్ళను తెరిచే ఉంచా
నా కన్నుల కాంతిలో నడిచివస్తావని ఊహిస్తూ
నీ కోసం ఎదురు తెన్నులు—ఇంకా ఎంత కాలం ఈ నీ స్మృతినాలో
ఆశతో ఎదురు చూస్తున్న నా కళ్ళు మసకబారుతున్నాయి.
కళ్ళల్లో కమ్ముకుంటున్న నీటి పొరలు గుండెలోకి జారుతున్నాయి.
తీపి జ్ఞాపకాలు నన్నావహించే వేళ నా కళ్ళు ఆర్తితో
నీ కోసం చీకట్లో వెతుకుతున్నాయి.
నా మధుర స్మృతిలోని ఆకృతీ—రావాలని ఉన్నాదారి అగుపించక
భీతితో అక్కడే నిలిచి పోయావా-రా భయాన్ని విడిచి
నాకు తెలుసు, నా కళ్ళు మూతబడక ముందే ధైర్యంగా
నువ్వీ చీకటి లోకాన్ని ఛేదించుక వస్తావని.

---

ఈనాడు విలేఖరి, శంకరపల్లి, రంగారెడ్డి జిల్లా

---

## సాహితీమిత్రులకు విజ్ఞప్తి

ప్రతి పేజీలో ఉత్తమ కవిత్వం ప్రసారం కావాలని అభిజ్ఞ ఆరాటం. ఆ ధ్యేయసాధనకు నిరంతరం కృషిచేస్తుంది అభిజ్ఞ. కవిమిత్రులనూ, సాహితీ కారులను తమ తమ కవితలు, వ్యాసాలు పంపమని సాదరంగా సమాహ్వా నిస్తోంది అభిజ్ఞ.

కవితలు అచ్చులో రెండుపేజీలకు, వ్యాసాలు ఆరుపేజీలకు మించకుండ ండటం అభిలషణీయం.

సయ్యద్ మోహసిన్

## జీవితం

దావు పులి నన్ను తరుముతూంటే భయపడి లోకంబావి
లోకి దూకా, నాకు తెలీకుండానే బావిలోని జీవితం చెట్టు
కొమ్మల్నించి వేళ్ళాడు తున్నాను. దావుపులి ఇంకా నూతి గట్టుమీద
తిరుగుతూనే ఉన్నట్లుంది.
రాత్రినల్లెలకా పగటి తెల్లెలుకా చెట్టుకొమ్మల్ని ఆదేపనిగా
కొరుకుతున్నాయి. క్రిందికి చూస్తే సమాధి మొసలి నోరు బార్లా
తెరుచుకుని ఆకలిగా ఎదురు చూస్తోంది. భయంతో అటూ ఇటూ
ఊగిస లాడుతున్న నా చేతులపై ఎక్కణ్ణించో తేనెతుట్ట
రాలి పడింది.
అంతా మరచిపోయి న్నేను అర చేతులమీంచి కారుతున్న
తేనె చుక్కల్ని చప్పరించడంలో మునిగిపోయాను.

ఆవంత్స సోమసుందర్

# లోర్కా అధివాస్తవిక కవిత్వం

"స్వర్గం ఒకణ్ణి ఖూనీ చేసింది
జుత్తు విపరీతంగా పెంచేశాను,
కొన్ని వెంట్రుకలు పర్వతాల్లా వ్రేలాడుతూ
కొన్ని ఉండకడుతూ, స్ఫటికాలై మెరుస్తూ
సంగీతం పలకదిపుడు చెట్టుతుండు
శిశువుముఖం తెల్లని కోడిగుడ్డు
పగుళ్ళిచ్చాయి మనుషులందరి మెదళ్ళు
నీళ్ళపై తపతపలాడుతూ పొడిపాదాలు

చెముడో మూగో అపస్మార మబ్బిందో
సీతాకోక చిలుక సిరాబుడ్డిలో మునిగిందో
కుంటుతూ మెకుకుతూ ప్రతికాలూ
రకరకాల వంకర్లుపోయే మొగాలు
అకాపికలంగా అయ్యోయ్యోయ్యో....
హత్యచేసిం దొకణ్ణి స్వర్గం....

గర్షియాలోర్కా 1920 ల ఆరంభంనుంచీ రకరకాల
వాదాలలో కవిత్వ ప్రయోగాలు చేస్తూనే ఉన్నాడు. అంతమా
జాతీయ కవిగా సామాజిక ప్రమేయాన్ని ఏనాడూ తిరస్కరిం
పరిణామం పట్ల నిబద్ధతను నిరసించలేదు. ముఖ్యంగా 19

అమెరికాలో కొద్ది వత్సరాలు గడిపినప్పుడు 'న్యూయార్క్ కవితలు' (Poet in New york) రచించాడు. ఆ గ్రంథం 1940లో గాని సమగ్రంగా స్పానిష్‌లోనే ప్రచురింపబడలేదు. ఆంగ్లానువాదం 1955లో ప్రచురితమైంది. ఆ గ్రంథంలోనిదే పై కవిత. 'కొలంబియా యూనివర్శిటీలో ఏకాంతం' అని దీని శీర్షిక. సార్వత్రికంగా లోర్కా న్యూయార్క్ కవితలలో ఆధునిక శిల్పవాదాలన్నింటినీ సంకీర్ణించినా ప్రధాన ముఖవైఖరిగా మాత్రం అధివాస్తవికతనే పాటించాడు. కవిత్వానికి అనుస్యూత జీవలక్షణమైన భావాన్వయతను ఛిద్రం చేయడమే సార్వత్రికంగా అవలంబించాడు. కొన్ని కవితలలో సర్రియలిజంనూ, ఎక్స్‌ప్రెషనిజంను, ఇంటీరియర్ మోనోలోగ్ సంవిధానాన్ని మిశ్రమం చేయడం కనిపిస్తుంది. అలాంటి శిల్పసంకీర్ణత పై అనువాదిత కవితలో సైతం పాఠకులు పోల్చుకుంటారు.

కొలంబియా యూనివర్శిటీలో కవి కొంత సేపు ఏకాంతంగా గడిపాడు. దానికి కారణం తన మనసు సంక్షోభంతో అతిలాకులతలమైవుంది. తన ఎట్ట ఎదటనే ఒక హత్య దారుణంగా జరిగిపోయింది. దానికి పెద్ద కారణం లేదు. భూతలస్వర్గంగా డాబులు చెప్పుకుంటున్న అమెరికా నిజజీవితంలో పసిడివన్నెల మెకం! ఏ చిన్న కక్షకైనా ప్రథమ పరిష్కారం హత్యే! హత్యలు జరగడం మంచినీళ్ళప్రాయం. ఇక నల్లవాళ్ళెదురైతే నల్లేరుపై బండినడకే....ఇంత సాధారణంగా మానవ మారణహోమం జరిపే ఆదేశాన్ని స్వర్గంగా సన్నుతించుకోవడం లోర్కాకి అసహ్యం వేసింది. కాని ఆ అసహ్యాన్ని సాధారణ వాచ్యపద్ధతిలో అభివ్యక్తం చేయలేదు. హృదయాన్నంతా ఆక్రమించిన ఆ అసహ్యభావోద్ధృతిని సంయమించుకున్నాడు. దాని స్థానంలో మరేదో చికాకును వ్యక్తం చేస్తున్నాడు. ఆ స్వర్గధామమూ ఒక నిండు మానవుణ్ణి సునాయాసంగా చంపేసింది. తనకు చేయగలిగే దేమీలేదు. నిస్సహాయంగా నిలబడి పోయాడు అసమ్మతితో వేలెత్తినా తన్నీ చంపిపడేస్తారు. కనకనే అంత సునాయాసంగానూ తన జుత్తు పెంచేసుకున్నాడు. అంతకన్న నిరసన ప్రదర్శించలేకపోయాడు. కవి తాను నిరసనగా పెంచుకొన్న వెంట్రుకలే_తన మనసుపై చీకటికొండల్లా వేలాడుతున్నాయి దుర్భరంగా అణుస్తున్నాయి. కొండలు అరణ్యమయం. వన్యమృగ సంకీర్ణం కొన్ని వెంట్రుకలు ఉండ కడుతున్నాయి. స్ఫటిక శిలలై వ్రేలాడుతున్నాయి

తన మనసునిండా క్లిష్టతరంగా పేరుకొన్న వేదన ఘనీభవిస్తోంది. ఛేదించ శక్యం కాకపోతోంది. హత్య కావించబడిన వ్యక్తి బృహద్దేహం—నరుకబడిన చెట్టు దుంగలా నేలకూలింది. అదిప్పుడు సంగీతం పలకదు. అది సజీవంగా ఉన్నప్పుడు గొప్ప సంగీతంతో అమెరికా సంస్కృతిని సంపన్నం చేసింది. ఈ పదచిత్రాలద్వారా రెండు విషయాలు ఒకే కేన్వాసులో స్ఫురణకు తెస్తున్నాడు లోర్కా.

ఖూనీచేయబడ్డ వ్యక్తి మహావృక్షంలా అజానుబాహుడనీ, అతను చంప బడే క్షణంవరకూ హాయిగా గొంతెత్తి పాడుతున్నాడనీ, ఈ రెండు సత్యాలూ స్పష్టంగానే ప్రతిపాదించాడు. ఇవి నీగ్రోలకు సామాన్యలక్షణాలు. జాజ్ సంగీతం ప్రపంచానికిచ్చిన మహత్తర జాతి నీగ్రోలే! వారు సహజంగా అజానుబాహులు చంపబడ్డాక ఆ వ్యక్తి శవం నరుకబడి చెట్టుదుంగలా నేలపై పొర్లాడుతోంది అది ఇంకేం పాడగలుగుతుంది? శిశువు ముఖం తెల్లని కోడిగుడ్డు అనడంలో రెండు చిత్రాలు దృశ్యమానమవుతున్నాయి. అలా చంపబడిన ఆ దేహాని చూడ్డానికి ప్రోగుపడ్డ ప్రజలలో ఎందరో శిశువులున్నారు. వాళ్ళమొగాలు భయ తో ఆశ్చర్యంతో నిర్వికారమై పోయాయి. తెల్లని కోడిగుడ్డుల్లా వెలవెలలా ఉన్నాయి. అంతేకాదు- రక్తం కాలువకట్టి ప్రవహించి-ఆ హతుని మొగమ తెల్లగా పాలిపోతూనేఉంది. పైగా కోడిగుడ్డులా ఏ అభివ్యక్తీ కనిపించని ని పదార్థంలా వుంది. అమాయకంగా, అర్థరహితంగా చూపరులగుంపులో మొగా హతుని మొగమూ వెలవెలలాడుతున్నాయి! అదీ కవి ఉద్దేశించిన చిత్రం.

ఈ అమానుష హత్యకు కారణం మరేమీలేదు. సంచరించే మన మెదళ్ళన్నీ పగుళ్ళిచ్చాయి. మెదడుకు బ్రేక్ యివ్వడం అంటే పిచ్చెక్కిం కదా! స్వర్గవాసుల జాతి ఉన్మాదావస్థలో తీసుకుంటోందని లోర్కా ధ్వ జేయదలిచాడు. ఈ వ్యాఖ్యానం దృష్టిలో పెట్టుకొని-పైన నా అనువా యిచ్చిన కవితను మళ్ళీ చదివితే కవితాంతర్భావం స్పష్టంగా అవగతమవు

న్యూయార్కు కవితల్లో లోర్కా అనూదానంగా వస్తున్న కవితా దాయాలను ఛిద్రం చేశాడు. ఉపమారూపకాది అలంకార సామగ్రిని బ రించాడు. అన్వయాది కవిత్వ మర్యాదల్ని బుద్ధి పూర్వకంగా భగ్నం

తన మనోభావాల్ని ప్రతీకలద్వారా విడివిడి పదచిత్రాలద్వారా చెప్పి ఊరుకు
న్నాడు. గాఢ ముద్రలను ప్రతిపాదించలేదు. వ్యంజనామయంగా సంవేదనలు
స్థాపించలేదు. స్థూలదృష్టికి అంతరిక సంబంధం కనిపించనంత విడివిడిగా
పదార్థాలను నెలకొల్పాడు. ఈ సంవిధానానికి అలవాటు పడని పాఠకులకు
ముందుగా ఏర్పడేది గందరగోళమే.

కాని ఒక్క విషయంలో మాత్రం మనం పొరబడకూడదు. ఆరంభ
యౌవన కాలంనుంచీ లోర్కా రచిస్తున్న భావగీతులలో సైతం ఒక చేదు రుచిని
బుద్ధిపూర్వకంగానే ప్రవేశపెడుతున్నాడు. సంప్రదాయ భిన్నమైన 'అపమార్గాన్ని'
ఆరాధిస్తున్నాడు. బాహ్యాభివ్యక్తిలో లోర్కా ఆత్మగత నిరోధాలను అధిక
రిస్తున్నట్లు కనిపించినా-సంప్రదాయ తీవ్రకామనలను అభివ్యక్తం చేయలేక
పోలేదు. భూగంధ భరిత గాఢ ప్రమేయాలను కవితావేశాలనూ వెల్లడి చేయక
పోలేదు.

అన్నింటికంటె ముఖ్యంగా మృత్యుదర్శనం అతని కవితలలో సార్వ
త్రిక అభివ్యక్తిని పొందింది. ప్రఖ్యాత సాహిత్యాచార్యుడు పెద్రో సాలినాస్
చెప్పినట్లు— 'లోర్కా కవితాసామ్రాజ్యంలో భావార్థ సూచనలు మెండు.
హెచ్చరికలూ శకునాలూ వంటివి జాతి జనులకు ముందుగానే అందించబడక
పోలేదు. మృత్యువుకు గల అనివార్యశక్తిని, ఆదిమత్వాన్నీ బహు భంగులుగా
వివరించకపోలేదు....' అన్న వివరణ ఎంతో సత్య సందర్శనం.

లోర్కా నాటక సాహిత్యమంతా, దాదాపు మృత్యుధూళి దూసరితమే.
చిత్రంగా రూపొంది అశేష కీర్తులార్జించిన 'రక్తకళ్యాణం'(Blood wedding)
మరీ స్పష్టం. ఐనా అతని కవిత్వం ప్రతిపదలావణ్య రాశి. సునిశిత రసభావ
సమన్వితం. శాశ్వత సత్యాలను అన్వేషిస్తూ సాక్షాత్కరిస్తుంది. లోకంపట్ల అవి
శ్వాసమూ అసంతృప్తి వ్యక్తం చేస్తూనే—మనోమయ వ్యోమకాంతిలో పల్లటీలు
కొడుతుంది. అతను నిర్మించిన పాత్రలలో—మేరియానాపినేడా ఆత్మబలి
దానానికి పూనుకుంటుంది. 'డోనా రోజెట్టా' జీవితం నిరాశావృత్తంగా, కాంక్షా
తుందిలంగా సాగుతుంది. రక్తకళ్యాణంలోని పాత్రలు విషాదాంత జీవనా
నందాన్ని అనుభవిస్తాయి. విషాదాంతంగా సాగే-ప్రేమ వైఫల్యంలో 'డాన్
పెర్లింప్లిన్' సంక్షోభమయత వ్యక్తం చేస్తుంది. 'బెర్నార్డ్ ఆల్బా' పాత్ర ఆత్మ

విధ్వంసకరం. రక్తకళ్యాణం నాటకమంతా, మార్మిక మహత్త్వపూర్ణ పాత్ర
లతో అలల ఒత్తిడికి యిటూఅటూ ఒరిగిపోతూ కదలిపోతుంది. మానవ జీవన
సాఫల్య వైఫల్యాలను ఏకదేశం చేస్తుంది.

ఈ కోణం నుంచి పరిశీలిస్తే—లోర్కా రచించిన న్యూయార్క్ కవితలు
అంతఃపూర్వం అనభివ్యక్తంగా అతని హృదయంలో దాగిన భావ సంకీర్ణతలకు,
మనోవైక్లబ్యాలకూ, సముచిత భూతల ముండుకున్నట్లే భావించవచ్చు.

ఈ కవితల స్వరూప స్వభావాలు మాత్రం-లోర్కా కవితా జీవితమంతా
సాధించిన అపూర్వ విజయాలకు సంపూర్ణంగా భిన్నమైనదే। ఏదో ఒక అస
హిష్ణుతకు ప్రతిచర్య అంతర్నిహిత మవుతుంది. లోకాన్ని విద్యుదాఘాతంలో
ముంచెత్తాలన్న కాంక్ష ద్యోతక మవుతుంది. తాను నిరసించిన పరిస్థితిలో,
వ్యవస్థలో ప్రత్యక్షమయ్యే అమానుషత్వం అరాచకత్వం తీవ్రంగా ఏవగించుకో
బడ్డాయి. అపార్థం పాలైన మానవస్వేచ్ఛ ఏకాంతంగా నిరసించబడింది.
న్యూయార్క్ కవితలు అమెరికన్ ప్రజాజీవన అస్తవ్యస్త పరిస్థితికి సంపూర్ణ
ప్రతిబింబాలు!

లోర్కా రచించిన పూర్వకవితలకు భిన్నమైనవని ఎందుకు అనవలసి
వచ్చిందంటే—న్యూయార్క్ కవితలలో లోర్కా వ్యక్తిగత గుణగణాలేవీ కని
పించవు. స్వాత్మకానుభవాలే ప్రదర్శితంకావు. కేవల వస్తుగత ఆవిష్కరణలు
తప్ప-కవిహృదయం ఎక్కడా పట్టుబడదు. స్వీయవ్యాఖ్యానాలేవీ సులభంగా
అందవు. పూర్వం రచించిన అసంఖ్యాక కవితలకూ—తదుపరి కాలంలో ఆమర
ణాంతం (1936) రచించిన అమేయ కవితా సందోహానికీ నడుమ న్యూయార్క్
కవితలు—ఒకలింకుగా, ఒక దేహళిగా, ఒక సరిహద్దు రేఖగా, పరిగణించాలి.

న్యూయార్క్ గీతాలలో గాఢమైన అన్యాపదేశాలనూ, నర్మగర్భ అధి
క్షేపాలనూ, నిక్షిప్తం చేశాడు లోర్కా. పైన ఉదాహరించిన కొలంబియా యూని
వర్సిటీలో ఏకాంతంలో వలెనే —వ్యాఖ్యానించుకుంటే తప్ప అర్థంకాని నిగూఢత
ప్రతిపాద్యమైంది. అతని పూర్వకవితలలోని ప్రసాదగుణం లోపించింది. అంత
మాత్రంలో హీన కవితలని అర్థంకాదు. పూర్వ కవితలలో కన్న ఈ కవితలలో
వస్తుగుణం హెచ్చు. నాటకీయత విస్పష్టం. ప్రతికవితా—రంగస్థలం మీదకు ఆక

స్మికంగా వచ్చిన ఒక పాత్ర స్వగతంవలె భాసిస్తుంది. ఆపాత్ర అలాగే ఎందుకు చెప్పవలసి వచ్చిందో అర్థంచేసుకోవాలంటే-పూర్వాపరాలను, పరిస్థితులనేపథ్యాన్ని, వ్యవస్థాగత యథార్థ్యాలనూ పాఠకుడే స్వయంగా అన్వేషించి అర్థంచేసుకోవాలి. కవి ఉద్దేశించిన మౌలిక తాత్పర్యాలూ అనిదం పూర్వమైనవే! అందుకోసం వినియుక్తమైన శైలిగాని, ప్రతీకలుగాని, పదచిత్రాలు గాని, కంఠ ధ్వని వైవిధ్యం గాని-అన్నీ అనిదంపూర్వాలే; ఇన్ని ఉత్తమ లక్షణాలు గల న్యూయార్క్ కవితలలో-ఈ కారణం వల్లనే విమర్శకులు అనితరసాధ్యమైన కవిగా లోర్కాను ప్రస్తుతించారు. అతని కవితా జీవితంలో, యిది ఒక పురోగమనం, ఒక విశిష్టమూర్తి మంతనం—అని వక్కాణించారు. అతని కళాత్మక జీవితానికి కలికితురాయి వంటిదేనని న్యూయార్క్ కవితలను స్తుతించారు.

లోర్కా ప్రతి కవితలోనూ ఒక విశిష్టగుణాన్నే వ్యక్తంచేశాడు. ఏ కవిత
ఏ రీతిగా రచించబడినా 'లోర్కా' అనే పూలచెట్టు వ్రేళ్ళు స్పెయిన్ భూతలంలో
లోతుగా పాదుకొని సారగ్రహణం కోసం అన్వేషించినవే; ఏ కవితలోనూ త
ఏ పూర్వ కవితకూ అనుకరణగాని, అనుసరణగానీ కనిపించకుండా ప్ర
కవితనూ అనవద్య సుందరంగా మలచగలగడం సామాన్య ప్రతిభకాదు. ప్ర
కవితలోనూ ప్రజా జీవన ధాతువులను సంపద్వంతంగానే ప్రతిబింబించాడు
స్పెయిన్ దేశంలోనే పుట్టినా లోర్కాకవిత ఆదేశానికే పరిమితమైపోలే
మానవతా మూల్యాలు ప్రతి స్పందించని కవిత దాదాపు దుర్లభమే; విశ్వ
తనే పురిడించిన దతని కవితా హృదయం. లోర్కా సహజకవిగా అవతరిం
డు. ప్రాపంచిక వాస్తవికతను ప్రతిబింబిస్తూ, ప్రతిధ్వనిస్తూ-విశిష్ట
తాల ద్వారా, ప్రతీకల ద్వారా—మార్పును అనుశ్రుతిగా ధ్వనింపచేశాడు.
గా లోర్కా అమేయశక్తి; అందుకే అతని చిరకాల మిత్రుడు, చి
కవి పాబ్లోనెరూడా ఇలా ప్రస్తుతించాడు. ('To Lorca' అనే గీత
"I could die for the sweetness that is you/I could die
red lakes/Where at mid-autumn you live/with a f
d and blood stained God/I could die by the

సి. వి. కృష్ణారావు

# ఎవరు పట్టాలె కోపు

ఒక మహోన్నతమైన ఆదర్శమంటే—నీ కనుగుడ్డు నిన్నొదిలి
అంతరిక్షాన్ని అందుకోట మన్నమాట
అప్పుడు నీ చూపు విహ్వాల విప్లవాగ్నితో వెలుగుతుంది
అది భూమ్మీది జ్వలన శిఖికాదు ఒక ప్రచండ ప్రజ్వలన రూపం
దానికి రెప్పలేదు రెక్కతప్ప. దానికి చిత్తు కాగితాల
చక్రవర్తి మాటలో అమృతాక్షరాలు కనపడతాయి.
అస్థిపంజరమైన చెట్టుకువేలాడే హరిత రహిత పత్రమైనా
ఒకటే. అందరూ తన వాళ్ళే. ఆదర్శ శిఖరంనించి అది జారదు,
ఓటమిలేదు, ఎరగదు, పాతాళంలేదు.
పొదనిండా పూలు పూయాలని, నీ అస్తిత్వం వెన్నెముకలో నిలవాల
పారిజాత మధుపవన వీచికలో రెపరెపమన్న సృజనా చిత్రం
చిత్రకారుని చేతి వేళ్ళ నుంచి జారినకుంచె వెంటాడే రూపమౌతుంది
నీవు పుష్పకంలో ప్రయాణిస్తూ ఈ స్వాప్నిక స్వర్గ ముఖద్వారం
తెరవక ముందే ఇక్కడ నగర వీధిలో నిన్ను నిరస్త్రుణ్ణి చేస్తారు
నీ వెన్నెముక విరగ్గొడ్తారు, నీ ఆకాపథానికి అడ్డంగా మబ్బులు పర
అంధకారానికీ అంధత్వానికీ తారతమ్యం లేకుండా చేస్తారు.
అప్పుడు నీ గుడిలేని గుడిశె గుమ్మానికి తెరవాల్తుంది.
నీ మెడలో వాడిన దండలు వేసి రోదిస్తూ రోదిస్తూ అఖరికి ఎవరు
ఏ కోపు పట్టాలో తేలేలోగా అస్తమించ కుండానే సూర్యుడు
అగడ్తలోకి దూకుతాడు.

నిఖిలేశ్వర్

# మరోసారి- 'ఏది సత్యం? ఏది అసత్యం?'

ఎవడి మనుగడ మర్మం
వాడికే అంతుతేలని ఈ అనంత విశ్వంలో
ఎంతో మందికి
చర్మరక్షణే అంతిమ ఆశయం!

ఒక్కొక్కడి ప్రాణం
మరొక్కడి ఎత్తుగడలో దాగిన చోట
"ఏది సత్యం?" "ఏది అసత్యం?"

దాపరికం లేని నిజమైన స్వేచ్ఛ
ఆత్మవంచన అసలే దరిచేరని వ్యవస్థ
ఏ దేవుడు ప్రసాదించగలడు?
ఏమతం దారి చూపించగలదు?
ఏసిద్ధాంతాల తర్కంలో
దాక్కొని పల్కరించగలదు?

ఆశయం-ఇప్పుడు ఆచరణలో
బలిపశువై నిస్సహాయంగా అరుస్తున్నాడు

దారితోచని స్వేచ్ఛ
మార్గదర్శకులనే మట్టు పెడుతున్నప్పుడు
చివరికి కాలమే సహజన్యాయమై
చరిత్రగతిని సూచించక తప్పదు!